


రచయిత :

భాషాప్రవీణ, విద్యాప్రవీణ

డాక్టర్ తూములూరు శ్రీదక్షిణామూర్తి శాస్త్రి M.A. Ph.D


## శాస్త్రిగారి ఇతర రచనలు - ప్రచురణలు

### ముద్రితములు

1. శ్రీ రామకథా2మృతము - సమగ్ర సమీక్ష ఆంధ్రా యూనివర్సిటీ వారిచే *Ph.D.* పొందిన పరిశోధన నిబంధము.
2. రామాయణం-సమాజ దర్పణం 1వ భాగము
3. రామాయణం-సమాజ దర్పణం 2వ భాగము
4. శ్రీరామ వాణి
5. వాల్మీకి వాణి
6. హనుమద్వాణి
7. పావనీ శతకము
8. మహాభారత పారిజాతము (సంకలనము)

శ్రీలలితాసహస్రనామ వివరణము (అముద్రితము)

9. మాటలంటే మాటలా ?
10. ముసునూరివారి వంశ చరిత్ర
11. తెలుగు వ్యాకరణము
12. భావదేవశతకము
13. శ్రీ వీరాంజనేయ శతకము
14. శ్రీ సత్యనారాయణ శతకము
15. శ్రీ కపోతేశ్వర శతకము
16. శ్రీ రాజరాజేశ్వరీ శతకము
17. శ్రీవిష్ణు సహస్రనామ స్తోత్రము ప్రతిపదార్థసహితము
18. శ్రీ త్రికూటేశ్వర త్రిశతి

# భావదేవ శతకము




రచయిత :

భాషాప్రవీణ, విద్యాప్రవీణ

**డాక్టర్, తూములూరు శ్రీదక్షిణామూర్తి శాస్త్రి**

ఎమ్.ఏ., పిహెచ్.డి.

కలలు కరిగిపోవఁ గళ్ళు బైరులు క్రమ్ముఁ
గాలిక్రింద నేల కదలఁబాఱు;
ఎవరు కాదనఁగలరీవు సంకల్పింప
సాక్షి భావదేవ! సదయ హృదయ! 121

శక్తిమయము జగము, సర్వశక్తి మహితుఁ
డీశ్వరుండొకండె శాశ్వతుఁడని
తెలసి మెలఁగువాఁడు తెలివి గలుగువాఁడు;
సాక్షి భావదేవ! సదయ హృదయ! 122

హరిహరులకభేద మను ధర్మ సూక్ష్మంబు
తెలియఁజేయ నిందు వెలసినారు
విభవమెసఁగఁ గాశి విశ్వేశ్వరుఁడు, నీవు
సాక్షి భావదేవ! సదయ హృదయ! 123

కఱకు గుండెకు మొఱలెఱుఁగఁబడవు; కాన
విశ్వనాథ ! నీకు విన్నవింతు
మంచి చెడ్డలరసి మన్నింపుమో దేవ !
సాక్షి భావదేవ! సదయ హృదయ! 124

శతకమొకటి వ్రాయ సంకల్పమును గూర్చి
భావ సముదయంబు, భాష నొసఁగి
పరిసమాప్తిఁ జేయు పాటవంబిచ్చితి
సాక్షి భావదేవ! సదయ హృదయ! 125



# "భావదేవ శతకము"

**శ్రీ మల్లాప్రగడ శ్రీమన్నారాయణమూర్తి**
**ఎమ్.ఏ.**

మాన్య మిత్రులు డా॥ తూములూరు శ్రీదక్షిణామూర్తిశాస్త్రి గారు బహు గ్రంథకర్తలు బ్రహ్మశ్రీ తాడేపల్లి రాఘవనారాయణ శాస్త్రిగారు వీరికి తాత మాత్రమే కాదు. విద్యాప్రదాత కూడా. బ్రహ్మ నిష్ఠులైన తమ తాతగారి వద్ద మంత్రోపదేశం పొంది, వారి దివ్యాశీస్సులను దండిగా అందుకున్న ధన్యజీవనులు శ్రీ దక్షిణామూర్తి శాస్త్రిగారు.

'నూనూగు మీసాల నూత్న యౌవనం' నాటి నుంచే కవితా సాధన సాగిస్తూ వచ్చిన శ్రీ శాస్త్రిగారు విద్యార్థి దశలోనే 'పావని శతకం' వ్రాసి, సహవ్రతుల ప్రసంసలను, అధ్యాపకుల ఆశీస్సులను అందుకున్నారు. ఆనాటి 'పావని శతకం' ప్రౌఢమైన శైలిలో, వృత్త పద్యాలుగా వెలువడింది. ఆ తరువాత శ్రీ శాస్త్రిగారు ఎన్నో విమర్శ వ్యాసాలను వ్రాశారు. వ్యాఖ్యాన గ్రంథాలను రచించారు.

ఇలా సాగుతున్న వీరి సాహిత్య ప్రస్థానంలో ఇప్పటి మజిలీ ఈ "భావదేవ శతకం" సమాజంలోని వెలుగు నీడలను చూచిన కవిహృదయ స్పందన శతరూపాలుగా వెలువడితే మనకు అందిన రచన ఈ శతకం. తన ఎదలో పొరాడే భావాలను కవి ఎవరికి విన్న వించుకోవాలి? ఇహికాముష్మిక సంపదలను తనకు ప్రసాదిస్తున్న భావ దేవునికే. అసలే ఆయన 'భావ' నారాయణుడు అంటే, భావమంటే 'మనస్సు' కదా ! పైగా, ఆయన 'సాక్షి' భావ నారాయణుడు తన మదిలో మెదిలే భావపరంపరను 'మనస్సాక్షి' తోడుగా సహృదయులకు అందించడమే 'భావదేవ శతకం' లో కవి చేస్తున్న పని.

"ప్రణవ మంత్రమీవె; పరమ దైవము నీవె;
సర్వభూత తతియు, సకల మీవె

నిఖిల జగమునందు నిండియున్నది నీవె;
సాక్షి భావదేవ ! సదయ హృదయ!"

ఇంతటి నిండు గుండెతో పరమాత్మను కీర్తిస్తూ శతక రచన సాగించారు కవి. ఆర్తితో గొంతెత్తి పాడుకోవడానికి అనుగుణంగా ఉన్న ఈ మకుటం శతకానికి అనువుగా అమరింది.

లోకవృత్తమే ఈ శతకానికి ఇతివృత్తం. అందువల్ల సమాజాన్ని, సమాజంలో అనునిత్యం ఎదురయ్యే విభిన్న మనః ప్రవృత్తులను గమనించిన శ్రీదక్షిణామూర్తి శాస్త్రిగారు ఆ ప్రవృత్తుల తీరు తెన్నులను అద్దంపట్టి చూపుతున్నారు ఈ శతకంలో. అందుకు అనువుగా ఆటవెలది ఛందస్సునే ఎన్నుకొని వేమన చూపిన బాటలో ముందుకు సాగిన శాస్త్రిగారు అభినందనీయులు.

"నీకుఁ దెలియనట్టి లోకవృత్తము లేదు
పాత్ర పలుకుటె పరిపాటి యగుట
నటన సూత్రధారి ! నానోటఁ బలికింతు"

తాను నిమిత్తమాత్రుడనని గుర్తించిన కవి, ఈ శతక రచనలో తన పాత్ర ఏమిటో వెల్లడించారు. సరళమైన భాషలో, సరసమైన తీరులో లోకం పోకడలను అనేక కోణాలలో విశ్లేషించారు కవి.

మానవ జీవితం చాల విచిత్రమైనది. చదువులున్నా, సంపదలున్నా, సంఘంలో గౌరవప్రదమైన స్థానం ఉన్నా, మానవుడు తన మనః ప్రవృత్తికి లోబడిపోయి కొట్టుమిట్టాడుతూ ఉంటాడు. తన బురదలో తాను కూరుకుపోయి ఉంటాడు. అందరిలో ఉన్న పరమాత్మ తత్త్వాన్ని దర్శించి, అందరితో కలసి మెలసి ఆనందంగా జీవితం సాగించడానికి బదులు స్వపర భేద భావంతో అడ్డుగోడలు కట్టుకుని అలమటిస్తూ ఉంటాడు.

"ఊరివారిదొకటి, యులిపికట్టెదొకటి,
యెవరిదారి వారిదవుట తలఁప
నైకమత్యమన్న యాలోచనే రాదు"

ఇది కవి ఆవేదనకు అక్షరాకృతి.



వ్యసనపరుఁడు వినఁడు వలదంచు వారింప
గుల్లఁజేయువఱకు నిల్లు, నొడలు;
మద్యపానమత్తుఁడుద్యమంబు గనఁడు;
సాక్షి భావదేవ! సదయ హృదయ! 115

దీక్ష వలన కార్యదక్షత సిద్ధించు;
గమ్యమునకుఁ జేరఁ గలఁడతండు;
అంబుధిఁ దరియించు హనుమ యాదర్శంబు;
సాక్షి భావదేవ! సదయ హృదయ! 116

ఎవరికే క్షణాన నెందేమి జరుగునో
తెలియరాదు, విధియుఁ దొలఁగి పోదు;
ఇంతమాత్రమునకె యెందుకీ గర్వమ్ము
సాక్షి భావదేవ! సదయ హృదయ! 117

వేషమొకటి కట్టఁ బెట్టి నటనఁజేయఁ
బంపినాడ వీప్రపంచవేది
పాత్ర ముగియుట, తెరపడుట తెలియరాదు;
సాక్షి భావదేవ! సదయ హృదయ! 118

అతిథి భుక్తశేష మన్నంబుఁదినువాఁడు
సకల ధర్మవేత్త; సాధుశీలి;
పెట్టినందుకిపుడు పుట్టుటే సాక్ష్యమ్ము;
సాక్షి భావదేవ! సదయ హృదయ! 119

ఉండనిల్లు లేదు, పండు పొలము లేదు
గడచు నీదు దయను గాలమిట్లు
వేల్పులందు నరయఁ 'గల్పతరువు' నీవు
సాక్షి భావదేవ! సదయ హృదయ! 120

వేద శాస్త్రముల వినోదించు విబుధుండు,
మూర్ఖుఁడు వ్యసనాలఁ బ్రొద్దుపుచ్చు
కర్మననుసరించి కాలంబు ఫలియించు;
సాక్షి భావదేవ! సదయ హృదయ! 109

కులము బలము నేఁడు కొలబద్దయై నిల్వ,
గుణగణంబు నెవఁడు గణన సేయు
రత్న మెచటనున్న రాణించు మిన్నయై;
సాక్షి భావదేవ! సదయ హృదయ! 110

ప్రకృతినెంతొ సుందరమ్ముగ సృజియించి
మనసు మాయఁజేసి, మానవులకు
మదము, మత్సరమ్ముఁ మలయఁజేసితివేల ?
సాక్షి భావదేవ! సదయ హృదయ! 111

శాంతి లేక బ్రతుకుసాగుట కష్టంబు;
శాంతి సర్వకార్య సాధనంబు;
శాంతి గలుగువాఁడె సకలార్ధ పూర్ణుండు;
సాక్షి భావదేవ! సదయ హృదయ! 112

ఎవరికెవరు బంధు వేదిసంబంధంబు ?
నిత్య సత్యమైన నిన్ను మఱచి,
సకల జీవకోటి చరియించు మోహాన;
సాక్షి భావదేవ! సదయ హృదయ! 113

కట్న కాన్కలంచుఁ, గాంచనాదికమంచు,
లాంఛనంబులంచు, 'లక్ష' గుంజి,
స్త్రీని గౌరవింపలేని మూర్ఖులయిరి;
సాక్షి భావదేవ! సదయ హృదయ! 114



"ఈశావాస్య మిదం సర్వం" అని ఉపనిషత్తులు నిరూపిస్తున్నాయి. ప్రతి అణువూ పరమాత్ముని సంపద కాగా, మనమంతా కేవలం ధర్మకర్తలం ఈ సత్యాన్ని గుర్తించలేక, పదవుల కోసం ప్రాకులాడుతూ నీతి నియమాలకు తిలోదకాలిచ్చే మానవుడు పశుప్రాయుడు. అధికార కాంక్ష ఎంత నీచమైనదో ఈ కవి మాటల్లో తెలుసుకుందాం.

"హద్దు పద్దులేని యధికార కాంక్షకు
నీతి లేదు; నియమ నిష్ఠలేదు;
సత్యదీక్ష లేదు; సాధుశీలము లేదు"

అధికార కాంక్షను నిరాకరించే కవి వ్యక్తిత్వము, భావ ప్రకటనకు తగినట్లుగా ఛందస్సును మలచుకోగల కవి సామర్థ్యము ఈ పద్యరచనలో ఒకదానితో ఒకటి పోటీ పడుతున్నాయి.

సామాజిక స్ప ృహ సాహిత్యానికి ప్రాణ స్నాయువు. సంఘంలోని ఎన్నో దురాచారాలను కవి ఈ శతకంలో నిరసించారు. వరకట్న వ్యామోహితులు "స్త్రీని గౌరవింపలేని మూర్ఖుల"ని, "వ్యసనపరుడు ఇల్లు, ఒడలు గుల్ల చేసుకుంటాడ"ని, "మద్యపాన మత్తుదుద్యమంబు గనఁడు" అని శాస్త్రిగారు ఘోషించారు.

పండితుడంటే ఎవరు ? తాను నేర్చిన వేద శాస్త్రాలలోని సారాన్ని ఒంట పట్టించుకుని ఆచరించి చూపేవాడు మాత్రమే. కనుకనే

"శాస్త్రజాలమర్థ సంపాదనార్థమే
పరిమితంబు జేయఁ బండితుండె?
ప్రజకు చెప్పు నీతి పాటింపఁగా రాదె ?"

అని ప్రశ్నిస్తున్నది కవి వ్యక్తిత్వం

లోకంలో కొందరు నిరంతరం సాటివాడి ఉన్నతిని చూసి ఓర్వలేక ఏడుస్తూ ఉంటారు. మానవుడు ఎంత ఎదిగినా, అసూయ అతనిలో ఉన్నంతవరకు అతనికి పతనం తప్పదని, అతడు మనశ్శాంతిని పొందలేడని వివరిస్తూ–

"భారతంబు వినమె; రారాజు జూడమే ?"
అని ఇతిహాస గాథలను గుర్తు చేశారు కవి. కనుక, ఉన్నదానితో తృప్తి పొందితే మనసుకు హాయిగా ఉంటుంది.

"ఉండనిల్లు లేదు. పండు పొలము లేదు,
గడచు నీదు దయను కాలమిట్లు;
వేల్పులందు నరయ 'కల్పతరువు' నీవు"

అంటూ భావదేవుని కృపా విశేషం వల్ల తమ జీవయాత్ర సాఫీగా సాగిపోతోందని గుండె నిండుగా సంతృప్తిని ప్రకటించారు కవి.

లౌకిక జీవన లాలసుడై మానవుడు నిత్య సత్యమైన దైవాన్ని మరచిపోతున్నాడని కవి ఆవేదన ఈ భోగ భాగ్యాలు సుఖ సంపదలు అశాశ్వతాలని, పరమాత్మను ఆశ్రయించాలని వైరాగ్యభావ సంపన్నమైన తాత్త్విక సత్యాన్ని కవి ఈ శతకంలో అక్కడక్కడ నిరూపించారు.

"నాయమాత్మా ప్రవచనేన లభ్యః"
అన్నది ఉపనిషత్తు

"అనుభవమ్ము లేని యాత్మబోధలు సేయు
పండితుండు పరమపదము గనఁడు
సాధనమున యోగ సంసిద్ధి సమకూరు"

అని వెల్లడించారు కవి ఈ శతకంలో. యోగ విద్య ఆవశ్యకమని, అది సాధన క్రమంలో ఆత్మానంద హేతువు అవుతుందని కవి ఇతర సందర్భాల్లో కూడా వివరించారు.

బ్రతుకు చదరంగంలో జీవులందరూ పావులే అని, 'జగన్నాటక సూత్రధారి' అందరినీ నడిపిస్తున్నాడని ప్రగాఢంగా నమ్మిన కవి

"వేషమొకటి కట్టఁబెట్టి నటనఁ జేయఁ
బంపినాఁడ వీ ప్రపంచ వేది
పాత్ర ముగియుట, తెరపడుట తెలియరాదు " అన్నారు.



పాప, పుణ్యములను బరికించి ప్రకటించి,
తగిన ఫలములిచ్చు ధర్మమూర్తి !
దుష్టులఁ గడఁదేర్చి శిష్టులఁ బ్రోవవే?
సాక్షి భావదేవ! సదయ హృదయ! 104

పరుల సాయమరయఁ బరమాణువైనను
మఱవరాదు, మనసు మారరాదు,
వృక్షములును ఫలములిడుఁ గృతజ్ఞతఁదోఁప;
సాక్షి భావదేవ! సదయ హృదయ! 105

అనుభవమ్ము లేని యాత్మబోధలు సేయు
పండితుండు పరమపదముఁ గనఁడు
సాధనమున యోగ సంసిద్ధి సమకూరు
సాక్షి భావదేవ! సదయ హృదయ! 106

మెతకతనము వేఱు, మెత్తఁదనము వేఱు,
మెతకపడినవారి మెచ్చరెవరు;
మెత్తఁదనము జగతి మేలొనఁగూర్చును
సాక్షి భావదేవ! సదయ హృదయ! 107

గతమునందు చేయు కర్మమ్ములెమ్మెయిఁ
బ్రబలత సుఖ దుఃఖ ఫలములిచ్చు;
సత్య ధర్మపథము శాంతి సౌఖ్యమయము;
సాక్షి భావదేవ! సదయ హృదయ! 108

బ్రతిమలాడ బదులు పలుకని మూర్ఖులు
బలము గలుగువారి బానిసలఁట;
ఉంగరాల చేతి సంగతి నిజమాయె
సాక్షి భావదేవ! సదయ హృదయ! 99

అసహనైకశీలు, రసమర్థ దుర్జనుల్
పరుల కష్ట సుఖములరయలేరు
తాము తలఁచినదె విధానమనుట మేలొ?
సాక్షి భావదేవ! సదయ హృదయ! 100

పాఱవింక దుష్టపాచిక లెవ్వియు;
శకుని మా(య) ప్రేమఁ దికమకఁ బడి
తొడలు విఱిగి పుడమిఁ బడుట తథ్యము కాదె !
సాక్షి భావదేవ! సదయ హృదయ! 101

వెండి తెరపయిఁ గల వెలుఁగుఁ జూచి, భ్రమసి
జీవితమ్ము వమ్ముఁ జేయఁదగదు;
కాల్పనిక జగమ్ము కలయె గాక, నిజమ్మె ?
సాక్షి భావదేవ! సదయ హృదయ! 102

"విద్య వలనఁ గలుగు వినయమ" నెడు సూక్తి
కర్థమలరు సుజనులందు నిజము;
దుర్జనులకెసఁగును దురహంకృతి యొకండు,
సాక్షి భావదేవ! సదయ హృదయ! 103



భారతీయ తాత్త్విక దృక్పథంలో 'శౌచం' ఎంతో ముఖ్యమైనది. శరీరం పరిశుభ్రంగానూ, హృదయం పవిత్రంగానూ ఉండాలని పెద్దలు మనకు దారి చూపించారు. "ఆత్మశుద్ధి లేని ఆచారా"న్ని వేమన్న ఈసడించాడు. మారుతున్న దేశకాల పరిస్థితుల్లో ఆచారాలు అడుగంటుతూ, సంస్కృతికి బదులు నాగరికత, పరిశుభ్రతకు మారుగా 'ఫ్యాషను' వచ్చి పడ్డాయి. అంతరంగం ఎలా ఉన్నా ఆడంబరాలకు మాత్రం అలవిమీరిన ప్రాధాన్యం సమాజంలో సర్వే సర్వత్రా కనిపిస్తోంది. మనసు కుళ్ళు కంపు కొడుతూ ఉంటే, ఒంటికి అత్తర్లు పూసుకున్నంత మాత్రాన ఏం ఒరుగుతుంది కనుక? అందుకే, "మనసులోన నెగడు మాలిన్యమేమౌను?" అని ప్రశ్నిస్తున్నారు కవి. అంతశ్శౌచం ఎంతైనా అవసరమని చెప్పడం కవి ఆంతర్యం.

లోకోక్తులను, నుడికారాలను, సామెతలను అర్థాంతరన్యాసలుగా వేసుకుని, కవి తాను చెప్పదలచుకున్న అంశాన్ని సమర్థంగా స్థాపించిన తీరు శాస్త్రిగారి నిశిత పరిశీలనా దృష్టికి నిదర్శనం. తప్పులెన్నువారు తమ తప్పు లెఱుఁగరు" అని వేమన్న చెప్పాడు కదా ! శాస్త్రిగారు "గుఱుతు పట్టి చూడ గురువింద చందమే" అన్నారు. పైగా, అలా తప్పులెన్నుతూ ఉండడం వారి జీవ లక్షణమని కూడా వివరిస్తూ "ఊరుకొనునె ? తిట్టు నోరు, తిరుగు కాలు" అన్నారు. వంచనా శిల్పంలో ఆరితేరిన 'మహానుభావులు' కొందరు నేటి సమాజంలో నిర్దోషులను నేరస్థులుగా చిత్రించి, 'కథ' నడుపుతూ ఉంటారు. అయినా, అంతిమ విజయం సత్యానికే – అని నమ్మిన కవి "దీపమున్న చోట తిమిరంబు నిలుచునే ?" అని ప్రశ్నిస్తున్నారు.

ఊరివారంతా కలసి ఒక ఘనకార్యం సాధిస్తే, అది తనదే నని గొప్పలు చెప్పుకునే దంబాచార పరాయణులు కొందరు కవికి తటస్థ పడ్డారు. వారి సంగతి ఆలోచిస్తూ, గుడి గోపురం వైపు చూసేసరికి అక్కడ ఒక బొమ్మ కన్పించింది. పైకి చూడడానికి బొమ్మ మూఁపున గోపురం నిలిచినట్లు కన్పిస్తోంది. అది సాధ్యమా? "గోపురమ్ము బొమ్మ మూఁపుపై నిల్చునా?" అంటూ కవి

స్తోత్కర్షా పరాయణులపై విమర్శనాస్త్రం సంధించారు. ఇలాంటివి ఈ రచనలో కోకొల్లలుగా కన్పిస్తాయి.

సమాజంలో అడుగడుగునా మూర్ఖులు మనకు కన్పిస్తూనే ఉంటారు. వాళ్ళనూ, వాళ్ళ వింత చేష్టలనూ, వాళ్ళ మూర్ఖత్వాన్ని చూస్తూ కొన్నిసార్లు నవ్వుకుంటాం మనం. మరికొన్ని సందర్భాల్లో వాళ్ళని చూసి "అయ్యో పాపం" అని జాలిపడతాం. సహనం చాలని వేళల్లో మండిపడుతూ ఉంటాం. అపుడపుడు వాళ్ళని అపహాస్యం చేస్తూ ఉంటాం.

ఇంతకీ, అసలు మూర్ఖుడంటే ఎవరు ? ఒక్క వాక్యంలో చెప్పాలంటే – తనకు తోచకపోవటం, ఇతరులు చెప్పినా వినకపోవడం మూర్ఖుడికి ప్రధాన లక్షణం. ప్రాథమిక లక్షణం. బీజ ప్రాయమైన ఈ లక్షణం నుండి అతని మనసులో, మాటల్లో, చేతల్లో మరెన్నో అవలక్షణాలు అంకురించవచ్చు. అంతకు పూర్వం అతనిలో ఏమైనా సుగుణాలు ఉన్నా, అవన్నీ తుడిచిపెట్టుకుపోతాయి ఈ లక్షణం వల్ల. కలుపు మొక్కలు పెరిగితే పంట పాడయినట్లుగా ఈ భావాన్ని కవి ఎంతో సూటిగా, తేటగా విశదీకరించారు.

"ఎన్ని మంచి గుణములున్న నేమి ఫలము ?
రెండు దుర్గణంబులుండు వరకు;
తనకుఁ దోఁచ దితరులనిన మాట వినఁడు.

మరో సందర్భంలో

"తనకుఁ దెలియకున్న c దగువారి నర్థించి
చక్కదిద్దుకొనును సజ్జనుండు
చేతకాని చెనఁటి చెప్పినన్ వినఁడయ్యో"

అని ఈ లక్షణాన్నే విశదీకరించారు. మూర్ఖత్వం పరాకాష్ఠ దశకు చేరిన మానవుణ్ణి చూస్తే కవి మనస్సులో ఎంతటి ఏహ్యాభావం కలిగిందో – చిత్తగించండి. "మందు మాఁకెఱుఁగని మాయరోగంబిద్ది" అంటారు కవి. నిజమే కదా!



క్షణము తృప్తుఁడగుచు, క్షణమసంతృప్తుడౌ
యవ్యవ స్థితమతి కాగ్రహంబు
వలె, ననుగ్రహంబుఁ గలుగ భయమెసంగు
సాక్షి భావదేవ! సదయ హృదయ! 94

కష్ట సుఖములొరులు గల్పించిరనుకొంచుఁ
గుమిలిపోవుచుండుఁ గుత్సితుండు;
పాప పుణ్యఫలమె ప్రాప్తించుఁ దనకెందు;
సాక్షి భావదేవ! సదయ హృదయ! 95

మాటలెపుడు వినినఁ గోటలు దాటును;
జేఁతలందు మొండిచేయిఁ జూపు;
స్వర్గము నఱచేతఁ బ్రకటించి, వంచించు
సాక్షి భావదేవ! సదయ హృదయ! 96

మొగమున మురిపించు ముసిముసి నవ్వుల;
మాయమాటలాడి మభ్యపెట్టు;
మంచి యాచరించు మనుగడ కొఱవడె;
సాక్షి భావదేవ! సదయ హృదయ! 97

కాలుదువ్వు నొకఁడు, కలహమాడు నొకండు
విసుగుకొను నొకండు, కసరు నొకఁడు
కాకి గోల చెలఁగె లోకాన వినుటెట్లు ?
సాక్షి భావదేవ! సదయ హృదయ! 98

తన సుఖంబె కోరుకొనెడు స్వార్థపరుఁడు
తోటివారి కొఱకుఁ బాటుపడఁడు;
"చిన్ని బొజ్జకెపుడు శ్రీరామరక్ష"యౌ;
సాక్షి భావదేవ! సదయ హృదయ! 89

ఐనవారికాకులందు వడ్డించుట,
కానివారి కొఱకుఁ గంచమిడుట,
ద్రోహచింతనంబు, దుర్మార్గవర్తన;
సాక్షి భావదేవ! సదయ హృదయ! 90

పులినిఁ జూచి నక్క, పోలికకైతాను
వాఁతలుంచుకొనిన భంగపడదె?
పరుల ననుకరింపఁ బరువు దక్కునె యెందు ?
సాక్షి భావదేవ! సదయ హృదయ! 91

మంచిగా నటించి వంచనఁ గావించు
పెద్దమనిషి, నమ్మ వీలు లేదు;
"మేకవన్నె పులులు లోకమ్ములందెన్నొ" ?
సాక్షి భావదేవ! సదయ హృదయ! 92

మాట వినుట లేదు, మనసు బోధపడదు
మండిపడుదురెపుడు మనిషిఁ జూచి;
మందు, మాఁకెఱుఁగని మాయరోగంబిద్ది
సాక్షి భావదేవ! సదయ హృదయ! 93



అయితే, ఈ శతకం నిండా మూర్ఖులను, దుష్టులను తూలనాడడమేనా కవి చేసిన పని ? – ఎంత మాత్రమూ కాదు. నీతి శాస్త్రం ఎప్పుడూ విధి నిషేధాత్మకంగా ఉంటుంది. మనం ఎలా ప్రవర్తించాలో, ఎలా ప్రవర్తించరాదో చెప్పడమే కవి లక్ష్యం. అందుకోసం సమాజంలోని అన్ని కోణాలనూ తడిమి చూశారు కవి. అందరి మనసులనూ తట్టి లేపారు కవి. చూడండి ! మరెన్ని మంచి సంగతులు మనవి చేశారో ఈ శతకంలో.

అతిథి పూజ భారతీయ సంప్రదాయంలో ఒక విశిష్ట ధర్మం.

"అతిథి భుక్తశేష మన్నంబు తినువాఁడు
సకల ధర్మవేత్త; సాధుశీలి;"

అని ప్రశంసించారు కవి.

విశ్వజనీనము, సార్వకాలికము అయిన ఎన్నో సూక్తులను ఈ శతకంలో సందర్భోచితంగా చొప్పించారు కవి.

"దీర్ఘవైర వృత్తి ధీర లక్షణమౌనె?".
"కలహశీలుఁడెందు కష్టంబులంబొందు".
"స్వార్థమతి కొదవునె సమరస భావంబు?".
"ఆచరించువాఁడె ఆదర్శవంతుండు".
"ఎవరి కర్మమునకు నెవ్వారు బాధ్యులు?".
"సత్యమైన వాక్కు నిత్యమై నిలువదే?".
"గీఁతలోన లేక గిల్లుకొన్నను రాదు"
"శాంతి గలుగువాఁడె సకలార్థ పూర్ణుండు"
"కర్మననుసరించి కాలంబు ఫలియించు"
"సత్యధర్మ పథము శాంతిమయము"

శ్రీదక్షిణామూర్తిశాస్త్రిగారి ఆలోచనా ధోరణికి, వ్యక్తిత్వానికి నిలువుటద్దాలు ఈ సూక్తులు.

ప్రతిభా పాండిత్యాలను సమపాళ్ళలో మేళవించుకున్న శాస్త్రిగారు సంస్కృతాంధ్ర సాహిత్యాల్లో విశేష పరిశ్రమ చేశారు. ఆ సంస్కారాన్ని జీర్ణించుకున్న వ్యక్తిత్వంతో వారు వ్రాసిన ఈ శతకంలోని కొన్ని పద్యాలు వారికి గల సారస్వత నేపథ్యాన్ని పట్టి యిచ్చేవిగా ఉన్నాయి.

"మనసులోన నొకటి; మాటాడు నొక్కటి;
చేయు నొకటి, చపలచిత్తుఁడెపుడు"

అనే పద్యం చూడగానే "మనస్యన్యత్ వచస్యన్యత్ కర్మణ్యన్యత్ దురాత్మనాం" అనే శ్లోకం మదిలో మెదలక మానదు. మరో సందర్భంలో "సకల జీవులాత్మ సమమని వినఁడొకో?" అని కవి పలికినమాట "ఆత్మవత్ సర్వ భూతాని యః పశ్యతి స పండితః" అన్న ఆర్షవాఙ్మయ సూక్తికి ప్రతిధ్వనిగా తోస్తుంది.

"వేద్యమైన శాస్త్ర విషయమనంతంబు
కాలమల్పము కడగఁడ్లు మెండు
హంస వలె విశేషమాహరించుట మేలు' అనే పద్యం
"శాస్త్రం హ్యనంతం బహువేదితవ్యం।
అల్పశ్చకాలో బహవశ్చ విఘ్నాః ॥
యత్సారభూత్ తదుపాసితవ్యం।
హంసో యథా క్షీరమివాంబు మిశ్రమ్॥"

అనే ఆర్యోక్తిని గుర్తు చేస్తుంది. అలాగే "కావ్యాలాప వినేదేన కాలో గచ్ఛతి ధీమతాం" అనే నీతి శ్లోకానికి భావానువాదాన్ని అందించారు శాస్త్రిగారు ఈ శకతంలో.

విద్య, ధనము, పదవి మొదలైనవి సజ్జనుల విషయంలో సార్థకమవుతూ, సద్వినియోగం అవుతూండగా "దుర్మతులకు నివియె మదంబు పొనరించున'న్న అభియుక్తోక్తిని శాస్త్రిగారు 103వ పద్యంలోఇముద్చుకున్నారు. "త్యాగ భావమునకు తరువులే గురువులు" అన్న 'కరుణశ్రీ' కవితోక్తిని 105వ పద్యంలో అనుసరించారు కవి.



మనిషి మనిషిలోన మాయా ప్రపంచంబు;
మంచి యనునది కనమెంచి చూడ,
ద్వేష పూరితంబు, రోష సంభరతంబు
సాక్షి భావదేవ! సదయ హృదయ! 84

ప్రాప్తమున్న యర్థమమరుట నిక్కంబు,
ప్రాకులాట వలన ఫలము సున్న;
"గీఁతలోన లేక, గిల్లుకొన్నను రాదు"
సాక్షి భావదేవ! సదయ హృదయ! 85

మూల విగ్రహంబు కాలు కదపకున్న
"నుత్సవిగ్రహంబు" లూరఁదిరుగు;
"విత్తమొకరిదైనఁ, బెత్తనంబొకరిది"
సాక్షి భావదేవ! సదయ హృదయ! 86

హెచ్చుమాటలాడు హీనునకెన్నండు
పరువు దక్కఁబోదు పదుగురెదుట;
మాట విలువఁ దెలియు మనిషి మహర్షియౌ;
సాక్షి భావదేవ! సదయ హృదయ! 87

తనను దానుఁ బొగడుకొనెడు నహంకారి
పరుల గౌరవించుటెఱుగఁడెపుడు;
సకల జీవులాత్మ సమమని వినఁడొకో ?
సాక్షి భావదేవ! సదయ హృదయ! 88

తనది కాని పక్షమున నితరులఁగాశి
దాఁక దేకుఁడనుట ధర్మమగునె ?
ఆచరించువాఁడె యాదర్శవంతుండు
సాక్షి భావదేవ! సదయ హృదయ! 79

కొఱవిఁ గైకొని తలఁ గోకికొనఁదగునె ?
తప్పు చేయ ముప్పు తప్పదెందు;
ఎవరి కర్మమునకు నెవ్వారు బాధ్యులు
సాక్షి భావదేవ! సదయ హృదయ! 80

వ్యర్థముగఁ బ్రయాసపడుటె కాని, తుదకు
ఫలము ననుభవింప వలను పడదు;
కోఁతి చేతిలోని కొబ్బరికాయౌను;
సాక్షి భావదేవ! సదయ హృదయ! 81

ఒకరు చెప్పినట్టిదొకరు మెచ్చుకొన లే
రెవరి గొప్ప వారలెంచుకొనుచు;
సత్యమైన వాక్కు నిత్యమై నిలువదే ?
సాక్షి భావదేవ! సదయ హృదయ! 82

ఘనుఁడనంచు, సిరియుఁ గలవాఁడననుకొంచు
విఱ్ఱవీఁగు వెఱ్ఱి వెంగళప్ప;
తెలివి యొకరి సొమ్మె ? కల ధనమ్ము తిరమ్మె ?
సాక్షి భావదేవ! సదయ హృదయ! 83



ఇలా ఈ శతకంలో ప్రతి పద్యమూ ఆణిముత్యమే. ప్రతి భావమూ అనుభవ సత్యమే. చక్కని భావ పరంపరను సాహితీ లోకానికి అందిస్తున్న ఈ శతకాన్ని గురించి ఎంత చెప్పినా, ఇంకేదో మిగిలిపోయినట్లే అనిపిస్తోంది. అయినా, ఎన్ని పద్యాలను ఉదాహరించగలను? పూలతోటలో అడుగు పెడితే మల్లె, మొల్ల, జాజి, గులాబి, చేమంతి. బంతి, పారిజాతం – ఇలా దేని పరిమళం దానిదే. దేని సౌందర్యం దానిదే. అలాంటి ఎన్నో భావ పుష్పాలున్న కవితానందనం ఈ శతకం.

“శతకమొకటి వ్రాయు సంకల్పమును గూర్చి
భావ సముదయంబు భాషనొసఁగి
పరి సమాప్తిఁజేయు పాటవంబిచ్చితి”

శతక రచనకు ప్రేరణ నిచ్చి, భావ సంపుటిని, భాషా సామగ్రిని సమకూర్చి తనను కృతార్థుని చేసిన దైవానికి కృతజ్ఞతలు చెల్లించారు కవి.

శతకం అంతా వ్రాసి చివరిలో శాస్త్రిగారు భావదేవునికి తమ కోరికను విన్నవించుకున్నారు.

“తపము చెఱచు గుణము తామసంబణగించి
నెమ్మి ధన్య జీవితమ్ము నిమ్ము”

ప్రతి మానవుడూ దైవాన్ని కోరుకోదగిన కోరిక ఇది.

కవి మనః పరిణతికి సాక్ష్యం ఈ కోరిక.

ఆంధ్ర శతక వాఙ్మయ చరిత్రలో ‘భావదేవ శతకం’ అక్షరమై నిలవాలని నా ఆకాంక్ష.

## మిత్ర వాక్యము

పూర్వం కేశవుడనే భక్తుడు ఇక్కడి నుండి కాశీకి తీర్థయాత్రకై వెళ్ళాడు. అతడా పుణ్యక్షేత్రంలో ధర్మబుద్ధితో అనేక దానాలు చేశాడు. అందులో కన్యాదానం ఒకటి. వెంట వచ్చిన మేనల్లుడు గోవిందుకు తన తనయను ఇస్తానని సంకల్పం చెప్పి అతని చేతిలో దానధార పోశాడు.

ఊరికి తిరిగి వచ్చాక ఆ విషయం తెలిసిన బంధువులంతా" ఆ గూనివాడికి (గోవిందుకు) బంగారంలాంటి ఈ పిల్లనిచ్చి పెళ్ళి చేస్తానంటావు, నీకేమైనా పిచ్చి పట్టిందా? అలా జరగటానికి వీలు లేదు" అని పేచీ పెట్టారు. ఆ మాటే గోవిందునికి చెప్పించారు.

'కాశీలో ఇస్తానన్నావు, ఇప్పుడిదేమిట'ని అడిగితే వారు అందుకు సాక్ష్యం ఎవ్వరని ప్రశ్నించారు.

"దిక్కులేని వారికి దేవుడే దిక్కు" అని నమ్మిన గోవిందుడు కాశీకి వెళ్ళి భావనారాయణుని ప్రార్థించాడు. సదయ హృదయుడైన ఆ భగవంతుడు తనతోబాటు కాశీ విశ్వేశ్వరుని కూడ వెంటబెట్టుకొని ఇక్కడకు వచ్చి సాక్ష్యం చెప్పి గోవిందుని వివాహ శుభకార్యం జరిపించాడు. ఆనాటి నుండి భక్త రక్షణ దక్షుడు అయిన స్వామి ఈ క్షేత్రంలో 'సాక్షి భావనారాయణుడు'గా ప్రసిద్ధికెక్కి సుజనుల పూజలందుకొంటున్నాడు. ఇది ఇక్కడి స్థల పురాణం. మంచిపని చేసేవారిని, అందుకు తోడుపడేవారిని పూజించటం లోక సహజమే కదా !

ఆడినమాట నిలబెట్టుకొని, పరోపకార పరాయణులై జీవించటం కర్తవ్యమనే ధర్మ సూక్ష్మాన్నితన ఆచరణ ద్వారా నిరూపించాడు. సాక్షి భావనారాయణుడు. ఆ ఆదర్శమే నరులకు వరవడి కావాలి. ఇదే నిజమైన లయనిజం. సజ్జనుడికిది నైజం.

పరుల మేలరయుటె పరమార్థమనియెడు
మాట చెప్పి, బ్రతుకు బాటఁ జూపి
దీనుఁగాఁచినావు గూని గోవిందుని
సాక్షి భావదేవ ! సదయ హృదయ !



"బోడి డబ్బుల"న్న బుద్ధిహీనుని మాట
తనకు లేవనియెడి తపనఁ దెలుపు
"డబ్బు లేనివాడు డుబ్బుకుఁ గొఱగాఁడు"
సాక్షి భావదేవ! సదయ హృదయ! 74

ఏడ్చువారలెపుడు నేడ్చుచు నుందురు
తృప్తినందువాఁడు దీప్తిఁబొందు;
దుష్టవాంఛలెల్ల దుఃఖంబులన్ గూర్చు
సాక్షి భావదేవ! సదయ హృదయ! 75

బలము గల్గువారు, బలగము గలవారు
దైవము నడిపించు పావులరయ !
సాగుచున్న బ్రతుకు చదరంగమందున;
సాక్షి భావదేవ! సదయ హృదయ! 76

గతము దలఁచి నేడు గర్వింపఁ బనిలేదు
తాతలెపుడొ నేయిఁ ద్రావ నిపుడు
వాసన లెగఁబీల్చు వారికేమి ఫలము ?
సాక్షి భావదేవ! సదయ హృదయ! 77

పైన పులుముకొన్న పరిమళ ద్రవ్యాలు
మఱుగుపఱచు బాహ్యమలినమెల్ల;
మనసులోన నెగడు మాలిన్యమేమౌను ?
సాక్షి భావదేవ! సదయ హృదయ! 78

మనసు చెడిన రోగి, మానవత్వము వీడి
పరుల కష్టపెట్టి మురిసిపోవు;
వ్యాధి ముదిరపోవ, వైద్యమే కనరాదు
సాక్షి భావదేవ! సదయ హృదయ! 69

దుష్టుని యధికార దుర్మదాంధత యందుఁ
బ్రజయు, ప్రభుతయుఁ గడుఁ బరితపించుఁ
జివరకేమి మిగులుఁ జెప్పుదెబ్బలు తప్ప ?
సాక్షి భావదేవ! సదయ హృదయ! 70

సాటివారితోడ సహవాసమే లేదు,
మనసు పొందిక యను మాట వినము,
"నన్ను ముట్టఁబోకు" "నాసరి లేర"ను;
సాక్షి భావదేవ! సదయ హృదయ! 71

ఆలుబిడ్డలన్న, నాత్మీయులన్న, నిం
కెవరినైన నమ్మఁడేమి కర్మ?
మీయిల "ననుమానమే పెనుభూతము";
సాక్షి భావదేవ! సదయ హృదయ! 72

నీతి, నియమమున్న నేనె మనిషినని
వెఱ్ఱి గంగులెత్తు వెడఁగు బుద్ధి
జుట్టు పీకికొనుచు, బట్టఁ జించుకొనుచు;
సాక్షి భావదేవ! సదయ హృదయ! 73



ఆ భావదేవుని గూర్చి శతకం వ్రాసిన రచయితను ప్రోత్సహించటం సమంజసమని భావించి, గ్రంథ ప్రకటనకు పూనుకోవటం జరిగింది. ఈ సాహిత్య సేవలో ఆర్థికంగా సహకరించిన మిత్రులందఱికి నా ధన్యవాదములు సమర్పిస్తున్నాను.

ఇట్లు :
లయన్ టి. వరదరాజులు
అధ్యక్షులు
లయన్స్ క్లబ్, పొన్నూరు-నిడుబ్రోలు
ప్రొ॥ ఊర్వశి షోరూం, పొన్నూరు.

కృతజ్ఞతలు

ఏ దేశ చరిత్ర చూచినా, ఏమున్నది గర్వకారణం ?
నరజాతి చరిత్ర సమస్తం, పరపీడన పరాయణత్వం..... శ్రీశ్రీ

పరులను హింసించి, వారు బాధపడుతుంటే చూసి, ఆనందించే స్వభావం కలవారే ఈనాడు లోకంలో ఎక్కువగా దర్శనమిస్తున్నారు. అట్టి దుర్జనులకు ఇతరుల కష్ట సుఖములకు స్పందించే సహృదయం లేదు. మంచి, చెడ్డలను విచారించి, నిర్ణయించి ఆదేశించే అర్హతగల న్యాయ వ్యవస్థకు చెవులు తప్ప, కళ్ళు లేవు.

'సాక్షి' అయిన (కళ్ళున్న) వాడు, సహృదయం గలవాడు అయిన లోకైక రక్షకుడు శ్రీ భావనారాయణుడొక్కడే అతనినే 'భావదేవుడు' అని కూడా అంటారు. కఱకు గుండెవారికి మొఱలు వినబడవు. చొరఁబడవు. ఆ విశ్వవిభునకు వినిపించుకొనటంలోనే ఔచిత్యము ఉందని, తగిన న్యాయం జరుగుతుందని నమ్మిన నేను "సాక్షి భావదేవ ! సదయ హృదయ" అనే మకుటంతో ఈ శతకం వ్రాసి ఆ దేవునికే వినిపించటం జరిగింది.

"తూములూరు వారి నోము ఫలమ్ముగా, భావదేవ మనన భాగ్యమబ్బె"నని డా॥ శ్రీ సూరం శ్రీనివాసులుగారు అశువుగా చెప్పిన ఒకనాటి మాట మంత్రమై

ఫలించి, ఈనాటికి ఈ విధంగా అక్షర రూపాన్ని పొందింది. దీనిలోని ఇతివృత్తం లోకవృత్తమే అయినా సాక్షి భావదేవుని సదయ హృదయమును గూర్చి తలపోయటం వలన హృదయం పవిత్రం అవుతుందని, అందులో భగవంతుని ప్రతిష్ఠించి సేవించుకొనే అవకాశం కలుగుతుందని త్రికరణ శుద్ధిగా భావిస్తున్నాను.

"మంచి ముక్కలు చెప్పండి" అని అడిగిన నాతో "మంచి ముక్కలయింది, ఏమి చెప్పమంటారు" అని చమత్కరించిన సాహిత్య వ్రతుడు, సారసత్వ పట్టభద్రుడు అయిన మా కళాశాల తెలుగు లెక్చరర్ కీ॥శే॥ దీని దీక్షితులుగారికి స్నేహ సంబంధంతో ఈ శతకాన్ని అంకితం చేస్తున్నాను.

ఈగ్రంథ ప్రకటనకు ప్రోత్సహించి, సహకరించిన పొన్నూరు-నిడుబ్రోలు లయన్స్ క్లబ్ అధ్యక్షులు *Ln. T.* వరదరాజులుగారికి, తదితర మిత్రులకు నా ధన్యవాదములు.

అడిగిన వెంటనే ఆత్మీయతతో 'ఆప్తవాక్యం' పలికిన శ్రీ మల్లాగ్రద శ్రీమన్నారాయణ మూర్తి, M.A., గారికి,

అడుగడుగున సంస్కరణలు సూచిస్తూ, ముద్రణ కార్యక్రమంలో దొనగులు దొరలనీయక సహకరించిన 'శాతవాహన చరిత' కృతి పతులు, "భాషాప్రవీణ" శ్రీ జొన్నలగడ్డ జానకిరామయ్య (రిటైర్డు సీనియర్ తెలుగు పండిట్, పొన్నూరు) గారికి

నా నమస్సుమాంజలులు సమర్పించుచున్నాను.

సకాలంలో చక్కగా ముద్రించి యిచ్చిన శ్రీ నటరాజ ప్రింటర్స్ అధినేత శ్రీ భాస్కరరావు గారికి, వారి సిబ్బందికి నా ధన్యవాదములు.

ఇట్లు
డా॥ తూములూరు శ్రీదక్షిణామూర్తిశాస్త్రి



చావు పుటుకలెల్ల సర్వ సామాన్యంబు
స్వాతిశయముతోడఁ బలుకుటేల ?
పాపమతికిఁ గలదె పరమార్థ మెందును ?
సాక్షి భావదేవ! సదయ హృదయ! 64

పరుల కష్ట, సుఖములరయువారెవరిందు
ఎద్దు పుండు కాకికేమి ముద్దు ?
స్వార్థమతి కొదవునె ? సమరస భావంబు;
సాక్షి భావదేవ! సదయ హృదయ! 65

తనకుఁ దోఁచు నర్థమును జెప్పు మూర్ఖుండు
కాదు కూడదనినఁ గలహమాడు
నిజము పలుకుటెల్ల నిష్ఠురంబిలలోన
సాక్షి భావదేవ! సదయ హృదయ! 66

సానుభూతి లేదు స్వాభిమానము పోదు,
సాధు జీవనమ్ము, సహన గుణము,
సామరస్యభావ సరణియుఁ, గనరాదు
సాక్షి భావదేవ! సదయ హృదయ! 67

చేతగానివాఁడు చేసెడు పనులెల్ల
వట్టిపోవఁబరులఁ దిట్టిపోయు;
"ఆడలేక మద్దెలోడ"ను రీతిగా
సాక్షి భావదేవ! సదయ హృదయ! 68

సందు దొరికెనేని సంస్కార హీనుండు
చెలఁగి నోరు జారుఁ, జిందులేయు;
ఊరుకొనునె ? "తిట్టు నోరు, తిరుగు కాలు"
సాక్షి భావదేవ! సదయ హృదయ! 59

మంకు పట్టుఁ బట్టు, మర్యాదఁ బోఁగొట్టు
మనసుఁ దెలియనీక మసలుచుండు,
మాటఁజెప్పి మఱచు, మాయలాఁడౌరౌర !
సాక్షి భావదేవ! సదయ హృదయ! 60

ఐనదాని విడిచి, కానిదానికి నేడ్చు
నాశ విడువఁబోవఁ డబ్బిగాఁడు;
అర్హత కలదేని యారాటపడనేల ?
సాక్షి భావదేవ! సదయ హృదయ! 61

నక్కజిత్తులున్న నయవంచకులఁ జేరి
సత్యముఁ జెఱఁబట్టఁ జాలరెపుడు;
దీపమున్న చోట తిమిరంబు నిలుచునే ?
సాక్షి భావదేవ! సదయ హృదయ! 62

శాస్త్ర జాలమర్థ సంపాదనార్థమే
పరిమితంబుఁ జేయఁ బండితుండె ?
ప్రజకుఁ జెప్పు నీతి పాటింపఁగా రాదె?
సాక్షి భావదేవ! సదయ హృదయ! 63



ప్రణవ మంత్రమీవె, పరమ దైవము నీవె,
సర్వ భూత తతియు, సకల మీవె
నిఖిల జగములందు నిండియున్నది నీవె
సాక్షి భావదేవ! సదయ హృదయ! 1

నిన్ను నమ్మి కొలుతు నెన్నడు నాస్వామి
పాదసేవ పరమ భాగ్యమనుచు;
భక్తకోటి కొంగు బంగారమే నీవు
సాక్షి భావదేవ! సదయ హృదయ! 2

పరుల మేలరయుటె పరమార్థమనియెడు
మాటఁజెప్పి, బ్రతుకు బాటఁ జూపి
దీనుఁగాచినావు గూని గోవిందుని;
సాక్షి భావదేవ! సదయ హృదయ! 3

భక్తితోడ నిన్ను భజియింపఁ గలుగవో
అష్ట సంపదలు నభీష్ట సిద్ధి;
గీతలోన నీవు ప్రీతితోఁ దెలుపవే
సాక్షి భావదేవ! సదయ హృదయ! 4

ఎదను నినుఁ దలంపఁబొదలును సంపదల్
రాజ్యలక్ష్మి నీకు రాణి యగుట
ఉన్న వారలిచ్చుటుర్విపై సహజమ్ము
సాక్షి భావదేవ! సదయ హృదయ! 5

అడుగకున్న నన్నమమ్మయుఁ బెట్టునె ?
ఆర్తరక్షకుండవైన నిన్ను
భక్తిఁదలఁపకున్న వరము లెట్లు కలుగు ?
సాక్షి భావదేవ! సదయ హృదయ! 6

ఆత్మ తత్త్వ మెఱిఁగి యానంద మయుఁడయి
బ్రహ్మ భావమనుభవమ్మునఁగను
యోగి ధన్యుఁడగును; యోగీశ్వరేశ్వరా!
సాక్షి భావదేవ! సదయ హృదయ! 7

ఈ శరీర మెన్నడేని యనిత్యము,
సకలమగు విభవ మశాశ్వతమ్ము
నిత్య సన్నిహితము మృత్యు, వాశ్రయమీవె
సాక్షి భావదేవ! సదయ హృదయ! 8

తపము చెఱచు గుణము తామసము నణఁచి,
నెమ్మి ధన్య జీవితమ్ము నిమ్ము;
దాసుని దొసఁగెల్ల దండముతో సరి
సాక్షి భావదేవ! సదయ హృదయ! 9

పత్ర పుష్పతోయ ఫల మాత్రము లనన్య
భక్తితో నొసంగు వారి క్షేమ
మరిసి, యోగ మొసఁగి, కరుణఁ జూతువు నీవు
సాక్షి భావదేవ! సదయ హృదయ! 10

శిష్ట రక్షణంబు, దుష్ట శిక్షణఁజేసి
బిరుదుఁ గాంచినావు "వరదుఁడ" వని;
ఇపు డుపేక్షఁ జేయనేల కర్తవ్యమ్ము ?
సాక్షి భావదేవ! సదయ హృదయ! 11



అన్ని యున్న విస్తరణఁగి మణగి యుండు
నేమిలేనిదెగిరి యెగిరి పడును;
మిడిసిపాటుతనము మేలొనగూర్చునా ?
సాక్షి భావదేవ! సదయ హృదయ! 54

ఎన్ని మంచిగుణములున్న నేమిఫలము ?
రెండు దుర్గుణంబులుండు వఱకు;
తనకుఁ దోఁచఁదితరులనిన మాట వినఁడు
సాక్షి భావదేవ! సదయ హృదయ! 55

సాగునే నిరంకుశ ప్రభుత్వములెందుఁ?
గాలగర్భ మందుఁ గలసిపోక;
తాఁడిఁదన్ను వాని తలఁదన్ను వాఁడుండు
సాక్షి భావదేవ! సదయ హృదయ! 56

ఉన్నతిఁ బడయంగ నుబలాటపడువారు
గొప్ప చెప్పుకొనుట తప్పుకాదు
పాప బుద్ధులేలొ? పరనింద గావింత్రు;
సాక్షి భావదేవ! సదయ హృదయ! 57

మంచి మంచి యన్న మంచెక్కి కూర్చుండి
మానవత్వమెల్ల మంటగలుపు;
మదమొసంగవె ? నడుమంతరపు సిరులు
సాక్షి భావదేవ! సదయ హృదయ! 58

రూపమొకటె గాని, రూపింప జగమందు
స్వరములోన భేద సరణి తోఁచుఁ
గాకి కోకిలలకుఁ గాలానుగుణముగ;
సాక్షి భావదేవ! సదయ హృదయ! 49

మాటలు విని, మనసు తేటయౌననుటెందు
దోసమగునుఁ; దుదకు మోసమగును
కంకణంబుఁ జూపి బొంకదే పులి మున్ను;
సాక్షి భావదేవ! సదయ హృదయ! 50

కోడి, కుంపటి, తన తోడులేక, జగతి
తెల్లవాఱదనుట చెల్లదెపుడు;
సాగిపోవుఁ బ్రకృతి సర్వకాలములందు
సాక్షి భావదేవ! సదయ హృదయ! 51

లేనిదానిఁ గూర్చి, కానిమాటలు చేర్చి
పలుకుట పరిహాస పాత్రమగును;
అదిగొ తోఁకయన్న; నిదిగొ పులి యటంద్రు
సాక్షి భావదేవ! సదయ హృదయ! 52

ఎవ్వరేమి చెప్ప నవ్విషయమె విని
నిక్కమంచు నమ్ముఁ; దిక్కులాఁడు
కల్ల నిజము తెలియు ఘనుఁడె వివేకియౌ
సాక్షి భావదేవ! సదయ హృదయ! 53



నిన్నుఁ గొలుచు వారికెన్నఁ డాపద రాదు
భక్త రక్షణానురక్తి తోడ
నార్తుఁడగు గజేంద్రు నాదుకొనవె? మున్ను
సాక్షి భావదేవ! సదయ హృదయ! 12

జరుగరానిదనుచు జగతి నేదియు లేదు
ఓడలగును బండ్లు; చూడఁజూడ
బండ్లు నోడలగు భవత్ప్రసాద గరిమ;
సాక్షి భావదేవ! సదయ హృదయ! 13

వేద్యమైన శాస్త్ర విషయ మనంతంబు
కాల మల్పము, కడగండ్లు మెండు;
హంస వలె విశేష మాహరించుట మేలు;
సాక్షి భావదేవ! సదయ హృదయ! 14

ఆత్మ సంగతి, పరమాత్మ రహస్యము
బోధఁ జేయు ప్రబల సాధనమ్ము
యోగ విద్య; సకల యోగి గమ్యుఁడవీవు
సాక్షి భావదేవ! సదయ హృదయ! 15

నీకుఁ దెలియనట్టి లోకవృత్తము లేదు
పాత్ర పలుకుటె పరిపాటి యగుట
నటనసూత్రధారి। నానోటఁ బలకింతు
సాక్షి భావదేవ! సదయ హృదయ! 16

ఊరి వారిదొకటి యులిపికట్టెదొకటి
యెవరి దారి వారిదవుట తలఁప
నైకమత్యమన్న యాలోచనే రాదు;
సాక్షి భావదేవ! సదయ హృదయ! 17

పరుల భాగ్యమునకు దురపిల్లు మూర్ఖుండు
చిత్తశాంతి లేక చింతఁ జెందు
భారతంబు వినమె; రారాజుఁ జూడమే;
సాక్షి భావదేవ! సదయ హృదయ! 18

అవసరానఁ బొగడు; నావలఁజెడఁదిట్టు;
"నోరు పలుకరింప; నొసలు వెక్కి
రించు"; లోకమందు వంచనఁ గనవచ్చు
సాక్షి భావదేవ! సదయ హృదయ! 19

కూటసాక్షి యైన కుటిలుండు వెతఁబొందు
శాంతి సుఖము లేక సంతతమ్ము
కట్టి కడుపుఁ బాపకర్మంబులెప్పుడు
సాక్షి భావదేవ! సదయ హృదయ! 20

తన్ను నెదిరి నెఱిఁగి తలపడుటొప్పును;
దుడుకుతనము వలన దోషమదరు;
ఈశ్వరు నెదిరించి యీల్గఁడే దక్షుండు ?
సాక్షి భావదేవ! సదయ హృదయ! 21



పిల్లి కళ్ళుమూసి మెల్లనఁ బాల్ద్రావఁ
జూడరెవ్వరనుట చోద్యమాయెఁ;
బ్రజకుఁ దెలియకున్నె పాపమ్ము, పుణ్యమ్ము?
సాక్షి భావదేవ! సదయ హృదయ! 44

"పలుకులందుఁదేనెలొలుకఁ బోసెడువాని
కంగిలి విషముండు" ననుటఁ దెలిసి
నమ్మరాదు, నెమ్మనమ్మున నెన్నండు;
సాక్షి భావదేవ! సదయ హృదయ! 45

ద్రోహబుద్ధి గలుగు దుర్మార్గవర్తికి
సత్య దర్శనంబు సాధ్యపడదు;
కాంచఁగలఁడె వెలుఁగు ? కళ్ళ కలఁకవాఁడు;
సాక్షి భావదేవ! సదయ హృదయ! 46

తనకుఁ దోఁచినట్లు తైతక్కలాడుచు
మంచి వినఁడు, ధైర్య మహిమఁ గనఁడు
"తా మునిఁగిన 'గంగ'; తా మెచ్చినను రంభ";
సాక్షి భావదేవ! సదయ హృదయ! 47

తనదె లోకమనుచు దర్పించు దుష్టుండు
కల్లలాడి బ్రతుకఁ గలఁడె యెపుడు?
"సత్యమే జయించు నిత్యముగఁ దుదకు
సాక్షి భావదేవ! సదయ హృదయ! 48

ఎదుట నొకటి, వెనుక నింకొకటి, పలుకు
నిలుకడున్నవాఁడె కలుఁగడెందు
మాట మార్చువాఁడు మన్ననఁ బొందునే ?
సాక్షి భావదేవ! సదయ హృదయ! 39

తనకుఁ దెలియకున్నఁ దగువారి నర్థించి
చక్కదిద్దుకొనును సజ్జనుండు;
చేతకాని చెనఁటి చెప్పినన్ వినఁడయ్యో;
సాక్షి భావదేవ! సదయ హృదయ! 40

కృతము నెఱుఁగు జనుఁడు కృతకృత్యుఁడౌనెందు
మఱల మేలుఁజేయ మఱచు ఖలుని
దుష్కృతమున కింక నిష్కృతియే లేదు;
సాక్షి భావదేవ! సదయ హృదయ! 41

వెంట వెంటఁ దిరుగు వెడమాలాడుచు,
వెకిలి నవ్వు నవ్వు వెగటుదోఁప
స్నేహమన్న మాట సిగ్గుపడ నటించు
సాక్షి భావదేవ! సదయ హృదయ! 42

దాలిగుంటలోన దంభానఁ గూర్చుండి
కసరి పొమ్మటన్నఁ గదలిపోదు;
కుక్కకేటి సిగ్గు కొట్టినా? తిట్టినా?
సాక్షి భావదేవ! సదయ హృదయ! 43



అహము హద్దుమీఱ, నిహపరంబులుచెడు
మమతఁ బెంచుకొన్న మాయఁ బెనఁగు
సమత గుణమె సతము సంతోషకరమౌను
సాక్షి భావదేవ! సదయ హృదయ! 22

పరుల తప్పులెన్ను పాపాత్ములందఱు
తమను గూర్చి తాము తలఁపరెందు;
గుఱుతుపట్టి చూడ గురువింద చందమే
సాక్షి భావదేవ! సదయ హృదయ! 23

తోటివారలనెడి మాటయే లేక, పో
పొమ్మటంచుఁ బలుకు పొగరుబోతు
బాగుపడునె? పరుల బాగు కోరుకొనునె?
సాక్షి భావదేవ! సదయ హృదయ! 24

పదవి కొఱకుఁ దాను ప్రాకులాడుటె గాని
పనితనంబు పెంచుకొనుట లేదు
హక్కులున్న వానికధికమౌ బాధ్యతల్
సాక్షి భావదేవ! సదయ హృదయ! 25

కలుపుగోలుతనము కనరాదు, వినరాదు
మొగము ముడుచుకొనెడు మ్రుచ్చులందుఁ;
గలహశీలుఁడెందుఁ, గష్టంబులం, బొందు
సాక్షి భావదేవ! సదయ హృదయ! 26

బ్రతికినన్ని నాళ్ళు బాధించుటే గాక
మృతుని పేరు విన్న మిట్టిపడును;
దీర్ఘవైర వృత్తి ధీర లక్షణమౌనె?
సాక్షి భావదేవ! సదయ హృదయ! 27

పరులపైనఁ తాము పచరించు ప్రేమకు
నాత్మ సుఖము (తృప్తి) ముఖ్యమగుట నిజము
జగములందుఁ దెలియ సర్వంబు స్వార్థంబు
సాక్షి భావదేవ! సదయ హృదయ! 28

మనసులోన నొకటి, మాటాడు నొకటి,
చేయునొకటి చపల చిత్తుఁడెపుడు;
మనసు, మాట యొకటి మహిత చరితునకు;
సాక్షి భావదేవ! సదయ హృదయ! 29

గుణము, దోషమనుచు గణియించుటె 'అసూయ'
మత్సరంబు బుద్ధి మాయఁజేయుఁ;
గట్టెనున్న నిప్పు కట్టెనే కాల్పదా?
సాక్షి భావదేవ! సదయ హృదయ! 30

హద్దు పద్దు లేని యధికార వాంఛకు
నీతి లేదు, నియమ నిష్ఠ లేదు;
సత్యదీక్ష లేదు సాధుశీలము లేదు
సాక్షి భావదేవ! సదయ హృదయ! 31

లాభమున్న దన్న లంచంబులందించుఁ
బానశాలఁ జొచ్చుఁ; బక్కఁ గూర్చు;
ఉన్న మర్మమెల్ల నూరివారెఱుఁగరా ?
సాక్షి భావదేవ! సదయ హృదయ! 32



పదుగురేఁగు బాట పదిలమై కడఁజేర్చు;
నడ్డఁ ద్రోవఁ బోవ నలము భయము;
భ్రష్టబుద్ధి కెపుడు కష్టాలు నష్టాలు;
సాక్షి భావదేవ! సదయ హృదయ! 33

ఎందఱెందఱిలను ముందేలినారలో
తామె సర్వ మనుచుఁ దలఁచుకొనుచు
వారలెందుఁ బోయినారొకో ! తెలియంగ
సాక్షి భావదేవ! సదయ హృదయ! 34

ఇచ్చువారు మఱియుఁ బుచ్చుకొనెడు వారి
నడుమ నడ్డుగోడలడరునెపుడు;
దైవము వరమీయఁదానీఁడు పూజారి
సాక్షి భావదేవ! సదయ హృదయ! 35

కష్టపడెడువారిఁగసరి, విసుగుఁగొన్నఁ
జేయుపనులఁబాడు చేయుటగును;
జగమున నతి తగదు సర్వత్ర యనరయ్య?
సాక్షి భావదేవ! సదయ హృదయ! 36

ఊరివారు పూని యుద్ధరించినదాని
గొప్పగాఁగఁదాను జెప్పనేల ?
గోపురమ్ము బొమ్మ మూఁపుపై నిల్చునా ?
సాక్షి భావదేవ! సదయ హృదయ! 37

సిగ్గులేనివాని చెప్పుడు మాటలు
జ్ఞాన హీనుఁడైన మానిసి విను;
నిజము నిలుకడపయిఁ బ్రజకెఱుకపడదొ ?
సాక్షి భావదేవ! సదయ హృదయ! 38